సొంపున వానిపై పదముపాడి వీణ
సొంపుగ మీటుదునే !
పలుమారు నామీద దయయుంచు మని వాని
పాదము లొత్తుదునే ! ఓ భామ ! ॥పల॥

3. మోసబుచ్చి నన్ను మువ్వగోపాలుడు
మోము జూప కున్నాడే !
వాసిదాన నని తెలిసి తెలియలేక
యాసలూరగ జేసెనే !
రోసము నిలుప డెటుల తాళుదు నే
దోసకారిని గూడెనే !
మీసముగల మగవాని వలెనే వచ్చి
మీసరమున నేలెనే ! ఓ భామ ! ॥పల॥

---

89. కాంభోజి - అట

(సామాన్య - ప్రౌఢ, ప్రతిభాచతుర)

పల్లవి :

వాదేల చేసెనే శ్రీ కృష్ణు - డాది వరాహుడు

అనుపల్లవి :

కాదన రమ్మా ? నా వల్ల - కల్ల కల్గిన నిపుడే ॥వాదే॥

1. ఇదిగో! దొండ పంటిపై వాలిన
యుదుటు తుమ్మె దంటి గాక
మదనుని కేళి - మగువల కాటుక
పెదవి సంటె నంటి నా? ||నా దే||

2. సంకుమీద - చందురు కోదములు
పొంక మాయె నంటిగాక! యుంగి
కొంకక తన గళముపై నెల
వంకలుంచె నంటినా? ||నా దే||

3. మేర మీరకు మని శంబర వైరి కేళి
నారె సారెకు - జాజుశయ్య నను
గోరి యంబుజవల్లి వరాహస్వామి
మీరి యేలినందుకు ||నా దే||

---

## 90. ఆనంద భైరవి - త్రిపుట

(సామాన్య - ప్రేమగర్విత)

పల్లవి:

వింటివా! అలదానిమాట - వింతలయ్యాని!

అనుపల్లవి:

అంటె అనవలె తానే - ఆడపై తే యిట్లాడునా? ||వింటి||

1. చల్లని మినసుదాన్నన్న - వల్లభుని ఎన్నిట మెప్పించి
ఉల్లము రంజిల్ల మోహా - ముప్పతిల్లగా
ఎల్లప్పుడు తనకౌగిటలో - అల్లాడనియ్యగా జేర్చి
అల్లి బిల్లిగా నుంచకనే - అతి నెట్లా వెళ్ళనిచ్చేనే! ॥వింటి॥

2. సకల కలావల్లభుని - సమ్మతించే సఖు లెవ్వరే?
వకనాతిని గాన నిపుడు - ననిత! యీచాన
అకట అతని సామ్మంటె-అందరు నవ్వారా? ఓ చెలియ!
ఎకసక్కెమాడితేను - ఎక్కువద నేరా భువిలో? ॥వింటి॥

3. చెలియా! మువ్వగోపాలుని - కలయుచుండే చెలులెవ్వరే?
ఇలలో వలరాజు పుట్టుక - యీపె కోసమా?
నెలత లందరికి ఇటుల - వలపించు కొన్నాడట వే?
తెలియనౌనా దానిమాయ? - తెలియదు పో
పొమ్మనవే! ॥వింటి॥

---

## 91. సైంధవి - ఆది
(సామాన్య - గురుమాన)

పల్లవి :
విడు విడు నన్నంట రాకురా!
ఓ రోరి జాణ!

అనుపల్లవి :
విడు విడు నన్నంట రాకు
వెరతు ముమ్మాటికి నేను!
విడిదికి మళ్ళి పోరా! - విజయరాఘవ! జాణ! ॥విడు॥

1. ఈ పొద్దు చిత్తము వచ్చెనా ? ఆ జవరాలు
ఇల్లు వెడలి రానిచ్చెనా ?
పో పోరా ! దానికై తే నేపాళరాజు ఇచ్చెనా
ఆ పెద్ద ముత్యాల సరులు దా నింటికై తే
దీపాళి పండగ చీరెలు (?) ఇక మెచ్చవద్ద ?
ఓ పట్టభద్రాంగి ! మేరలు – ఓరోరి జాణ ! ॥విడు॥

2. చక్కనయ్య నీకె చెల్లునా ? యీలాగై తే
సవతి నీకె సొక్కు జల్లెనా ?
దక్కితి సొక్కితివి – దక్కేవురా ! దాని కై తే
ముక్కెరకు మురుగు – ముత్యము ఆ రాణి కై తే
ఒక్కొక్క వరాని బత్యము అమ్మనే జెల్ల !
ఎక్కడిది నీకు సత్యము ! ఓరోరి జాణ ! ॥విడు॥

3. కోడెకాడ ! ఇందు వత్తురా యీలాగై తే
కొమ్మకు ఇదెల్ల హత్తురా !
ఆడకె మళ్ళీపోరా ! ఆ మోహపు రాణికై తే
కేడెంపు వజ్రాల కమ్మలు ఆ రాణికై తే
జోడించిన ఉంగరమ్ములు నాతో నై తే
జాడిగానె ఇచ్చకములు ఓరోరి జాణ ! ॥విడు॥

### 92. ముఖారి - ఆది

(సామాన్య - గుణమాన)

పల్లవి :

విడు విడు మమ్మ ! యిదేటి సుద్ది ?

అనుపల్లవి :

పడతింటికి పోలేదని - సాగ చేయించుకొనె వలె ! ||విడు||

1. కద్దు కద్దనిపించే దాన - కట్టినదే దానికోక !
సుద్దులు పల్కి యుందాగ - సుదతింటికి వచ్చేరాక ||విడు||

2. ఎదిరించితే కాదనేవు - ఏటికే యీ దూరుదూరు
పదిరేది కాదు నా తీరు - అదిగోనె చెక్కుట గోరు! ||విడు||

3. మును వన్నెలినట్టి మేటి - మువ్వగోపాలు డిప్పాటి
దిన దినము నాతో సాటి - వనితలలో నేటి పోటి ?||విడు||

---

### 93. కాంబోజి - త్రిపుట

(సామాన్య - స్వాధీన పతిక)

పల్లవి :

వేడుకతో నడుచుకొన్న - విటరాయడే !

అనుపల్లవి :

ఏడు మూడు తరాలనుండి - ఇందున్న కాణాచట
గూడుకొని మా మువ్వ. గోపాలుడౌ విభుడు ||వేడు||

1. మధుర తిరుమలేంద్రుడు - మంచి బహుమాన మొసగి,
ఎదుట గూర్చుండు మని - ఎన్నిన ఇమ్మనె నే!
ఇదిగో రెండు వేల పదము - లిపు డెంచుకొమ్మనిన
చదురు మీదనే ఉన్న సామికి - సంతోష మింతింతగాదె!
॥ వేడు॥

2. అళుకు దీరి తంజాపురి - నెలకొన్న విజయరాఘవుని
వెలయ మనుజుల వెంబడి - వేగమె పొడగాంచి
చలువ చప్పరమున నుండగ - చక్కగ వేయిపదముల
పలుకరించుకో గానె - బహుమానమిచ్చె నా వేళ! ॥ వేడు॥

3. బలవంతుడౌ గోలకొండ - పాదుపా బహుమాన మిచ్చి
తులసి మూర్తితో వాదు - దలచె నా వేళ!
వెలయ మువ్వ గోపాలుడు - వెయ్యిన్నెనూరు పదములు
నలువది దినముల లోన-నన్ను గలసి వినుపించెనే! ॥ వేడు॥

---

## 94. ఆనందభైరవి - అట

(సామాన్య - పౌఢ, క్రియావిదగ్ధ)

పల్లవి :

సకియ యుపరతి సేయు సమయమున

అనుపల్లవి :

అకలంకమగు పుణ్యా మబ్బు నని తలచె

1. సతి మోముపై కెగబూయ కీ - ట్టడి జూచి కలసి
పతియు పరాగం బనినను - పసుపు ద్రవ్యమున
గతి మీరంగా పుణ్య - కాలమనుచును నేగ
మతివ జలకములాడ - నానంద వార్థిసి ||సకియ||

2. స్మరమంత్ర తంత్రములు - సంకల్పములు చెప్పి
హారువు మీరంగ - మరుకేళిని వేడ్కను
సరిగ కుచకలశముల - జాగు సేయ చెమటచే
తరళాక్షి జఘన భూ - దాన మొసంగగన్ ||సకియ||

3. తరుణి చేమీదుగా - తాంబూల పూర్వకముగ
సరలి మానధనంబు - సర్వమొసంగగన్
మరుకేళి వేడ్కతో - మగువ యుపరతి సనంగ
అరది కృష్ణునికి పర - మానంద మొయ్యెన్ ||సకియ||

---

## 95. బేగడ - త్రిపుట

(సామాన్య - దివ్యాదివ్య)

(నాయికా నాయకు లిరువురున్ను అత్యంతప్రీతితోనుండి మరల ఇద్దరికిన్ని కలతకలిగి నాయకుడు ఈనాయికను మానేకొంటు తన పొందుగింటి దానికి దౌత్యం విడిచినందువల్ల నాయికను తెలిసి కోపవచనముగా సఖితో తెలియజేసుకొన్నది.)

పల్లవి :

సరసము గా దిక - సకియా!

అనుపల్లవి :

సరసము గా దిక - సకియరో! కరిగిరి
వరదుడు నా గుణ - మెఱుగక నడిచెను ||సర||

1. పదరి వా డిందు వచ్చి – పడ కిల్లు సొచ్చితే
నిదుర లేప వద్దని – నెలత, నీ వనుమీ!
కదిసి మెల్లన నిచ్చ – కములకు వాడు నా
పదము లొత్త వచ్చితె – పట్టనీయకుమీ! ॥సర॥

2. అతివ! వినవే నాలు – గైదు దినముల దాక
బతిమా లించక కాని – భయము రాదమ్మ!
అతితమి గాగిట – నదుముకొని కెమ్మోవి
యత డాన వచ్చితె – అంటవ ద్దనుమీ! ॥సర॥

3. పరగ మా మువ్వగో – పాలు డైన కంచి
వరదుడు నను గూడి – వదలక యుండి
మఱి యే యెన్నిక లేక – గరివించి హరిగింటి
హరిణాక్షి నడిగించె – నని వింటి వమ్మ! ॥సర॥

---

## 96. కాంభోజి - అట
(సామాన్య - ప్రౌఢ, ప్రేమగర్వితా)

పల్లవి :

సామాన్యము గాదె! వానిపొందు
సామాన్యము గాదె!

అనుపల్లవి :

ఏ మననేరని భామలు వానికాసించి – రే మందు?
విజయరాఘవుడే సామి సుమ్మి!

భూమియందు వాని గుణము లెన్న జనులకు
వీనుల విందు ఓ చెలియరో! ॥సామా॥

1. పాయపు పాంతకారి కావలె! - వాని పదపద్య రచన
సేయ నుత్తర - మీయవలె! వానిముద్దు కవిత తా
వ్రాయ చదువ నేర - వలె! ఆ నగలయందు
గాయకురాలు - గావలె! ఓ చెలియరో! ॥సామా॥

2. ఆటకు మేటి గావలె! తంబుర
నోట మీటరాగ మనవలె! వానిపై సొగసు
పాటలు వినుపించవలె! వాని మనసు దెలిసి
మాట లాడ నేరవలె! ఓ చెలియరో! ॥సామా॥

3. కప్పుర బాగా లీయవలె! వాతెరకు తేనె
చిప్పిల్ల సగమా కీయవలె! తమి హెచ్చేవేళ
తప్పక మోవి నొక్కవలె! విజయరాఘవుని
అప్పుడె పైకొని కూడవలె! ఓ చెలియరో! ॥సామా॥

---

97. ముఖారి - ఆది

(సామాన్య - స్వాధీనపతిక)

పల్లవి :

సామికి సరి యెవ్వరే? నా చక్కని

అనుపల్లవి :

భామరో! తిరువళ్లూరి వీరరాఘవ!

1. నెలతరో! ఎప్పుడైన - నేనే చెక్కిలి జీరి
కలగి యెరుక లేక యే - చెలియ జీరెనంట!
తెలుసు కొమ్మనుగాని - యలగి మారు బలుకక
చలియించని నిందు కుండ - వలె నుందు నమ్మ! ॥సామి॥

2. కదసి నేనే వాని మోవి - గంటి చేసి మరపున
పదరి యీలాగున నే - పడతి యుంచె నందునె!
అదరీన? కోపగించీన? - అలసీన! సొలసీన!
మదిరాక్షి! నా చిత్తము స - మ్మతి బరుచు నమ్మ!
॥సామి॥

3. భామరో! మా మువ్వగో - పాలు డౌ వీరరాఘవుడు
కాముకేళి హాయలుగ - గలసి యుండగ
ఏ మగువ వద్దనైన - ఈలా గుందువో యంటె
ఈ మాటెట్లంటివని - ఎంతో యుస్సురనె నమ్మ!
॥సామి॥

---

98. కాంభోజి - త్రిపుట
(సామాన్య - ప్రౌఢ, తృప్త)

పల్లవి:
సుదినమాయనే! యీ ప్రొద్దు - సుదిన మాయనే!

అనుపల్లవి:
మదనావతారుని సేవ - మనసు గలిగెనే! ॥సుదిన॥

1. ప్రొద్దున నిలువు టద్దము - పొసగ గన్న ఫలము యీ
ముద్దుమోము చూపించితి గా - ముద్దుల గుమ్మ ||సుదిన||

2. ఈ పొద్దు పూర్వపుణ్యము - పొదమరైన ఫలము యీ
భూపాల కుంజరుని నే - పొందు గంటి నమ్మ! ||సుదిన||

3. ద్విజరాజుల సేవించిన - దివ్యఫలము యీ
విజయ రాఘవు నేలగ - విడదీయక గంటినమ్మ ||సుదిన||

---

## 99. సావేరి - త్రిపుట

(సాహూన్య - అన్యస్త్రీ నాయకుడు తన సుందరి త్రోవ తప్పి గతి యందు తమిచూపనందున తృప్తిలేనిగ)

పల్లవి :

హితవైన చోటనే హిత వింత లేకనే
'యుంపారు నటరా? నీకు!

అనుపల్లవి :

వితరణ శూర వమా - విజయరాఘవ ధీర!
విందువా? నా మాటలు ఓరోరి జాణ! ||హిత||

1. ముచ్చటై నే నొక్క - ముద్దు పెట్టెద నంటే
[illegible] మోహా మెట్టు జేసితివి!
పచ్చితేరగ నాతి - పలుకెంపు లుంచితే
[illegible] బాగాయె ననియుంటివి ఓరోరి జాణ! ||హిత||

2. ఇందునే సేబట్టి – యింటికి రమ్మంటే
ఎంతైన గసరితివి !
సందిటిపై గోరులు – సఖియ యుంచితే
సంతోష పడి యుంటివి ఓరోరి జాణ ! ॥తహి॥

3. ఇసుమంత సేపు స – న్నేలి విజయరాఘవ
యింటికి బొమ్మంటివి !
రసికుడా దా నింట – రాతిరి నాలుగు జాములు
రమ్యముతోనుంటివి ఓరోరి జాణ ! ॥హిత॥

---

# క్షేత్రయ పదములేవెూ?

## 1. కాంభోజి - చాపు

(స్వీయ - ముగ్ధ, విరహోత్కంఠిత, నాయకుడు - శఠుడు,
కరుణా శృంగార రసములు)

పల్లవి :

ఇదిన్యాయమా నీకు ఇతరులవలచేది-ఇంతినే నొకతుండగా!

అనుపల్లవి :

సదయహృదయుడ! నే - సమర్తాడి నెలలాయె
సరగున ననుగూడ - సమయమై యుండగ ॥ఇది॥

1. చిన్ననాడే యా - శృంగార వనములో
చెన్నుమీరగ మనము - చేరికూడుండగ
వన్నెకాడ! నాడు నీ - వన్నమాట నేడు
ఒన గూర్పక నీవు విదలించు - కొని పొయ్యే ॥ఇది॥

2. సొక్కియున్న వేళ - చెక్కిలి నొక్కుచు
మక్కువతో నన్ను - మరచిపో ననుచు
పెక్కువిధముల నా - కొట్టుపెట్టి యిపుడు
చక్కని సామిగా - టక్కుచేసి పొయ్యే ॥ఇది॥

3. నిన్ను జూడక అర - నిముసమ్ము తాళర
కొన్నమగడ నీ వని యను - కొంటిరా
వెన్నెలగాసెర - వేడ్కతో గూడిర
పన్నగ శయన (శ్రీ) - పార్థసారథి! యిపు ॥డిది॥

---

## 2. యదుకుల కాంభోజి - త్రిపుట

(పరకీయ - విరహోత్కంఠిత, నాయకుడు - శఠుడు,
విరహ విప్రలంభ శృంగారము, కరుణారసము)

పల్లవి :

ఎంతని వేడిన చెంత జేరకున్నా(వు) - ఇంతకోప మేలరా ?

అనుపల్లవి :

రంతుకాడ ! కంచి రంగేంద్రుని కుమార !
రారాయుడ రంగా ? యీ-రాపులేలరా? ॥ఎంతని॥

1. కన్నులు విలుకాని - ఘన బాణ జాలముల
కరిగినే నిట్లుండగా సామి ! యిన్నాళ్ళదాక
నన్ను బాసియుండుట నీ కెట్లు మది దోచెరా ?
నిన్న నేటివారు నీకు ప్రియమైనారా ?
నిన్నన పనిలేదు ఆ-నెలత సేయు మాయలకు ॥ఎంతని॥

2. బలిమిని పిలిపించుక – వచ్చినప్పుడె తెలిసె
తెలిసెరా నీ జాడలు ? వలసి [illegible]
పలుకే బంగారమా ? – నిన్నే కావలె [illegible] యిప్పుడు
కలనైన నీ మాట – గణచినా [illegible] ?
చలము సేయక రారా – సామీ [illegible] తాళలేనురా
॥ఎంతని॥

3. ఇదివరకు నినుబాసి – ఎన్నో తాపము లొందితి
ఏమీ తోచక నుంటిరా
సదయ! రారా నీ మనసార ఎప్పటివలె – జాగు సేయక నేలరా
అదనమున నీపై – ఆశ పెట్టించితిరా
మదనావతార నీ – ముద్దు రా [illegible] ॥ఎంతని॥

---

3. ముఖారి - ఆది (పదము)

(స్వీయ - విరహోత్కంఠిత, నాయకుడు - శఠుడు
విరహ విప్రలంభ శృంగారము, [illegible] రసము)

పల్లవి :

చలము సేతురా నాపైని ?–చక్కని సామి! జాలమేల రారా
కలువల రాయడు పలుమారు నన్నే – వలపట్టెరా పలుక
వేమి నాతో బాలగోపాల ! సామి !

అనుపల్లవి :

పరాకు వలదని మరిమరి దెలుపగను వినవటె నా మనవిని
సరోజముఖిని గరాగరిగ ముదంబు [illegible] నేలగ నిదేసమ
యము సరసా ! యిపుడు ॥ చలము సేతురా ॥

1. నీ కింతైన దయ లేదటరా ? స్వామి !
ఏ సఖి బోధించెనురా ? ఏరా మాటాడవు పలిచితే ?
సదయ ! ॥చలము॥

2. మున్ను కడుప్రేమతో నెరతీవితో నుంచిపలుకులతో
కూడితి వపుడే మరచితిసామి ! ॥చలము॥

3. బాలనురా ! నిరపరాధినిరా ! అలుక సేయ తగవగునటరా
పూలవిల్తుడు డాసి పలు చలము పూనియు నెద గదియ
శరములేయగను తాళగవశమ ? ॥చలము॥

4. సారెకును నేరము లెంచెదవేల ? ఎవరైన విని నగర ?
కోరి నిన్ను వలచియున్న నన్ను కన్నడ చేసెద వపుర !
యిదే ఘనమ ? భళి భళిర ! ॥చలము॥

5. వేరుసేయకుర మరెవ్వరి వేడబోదురా ? చెలువుడ నను
కూరిమి తోడ మదనుని కేళి నెనయుము నినుబాసి నే
నోర్వగజాలను గదరా ? ॥చలము॥

---

4. ముఖారి – చాపు

(నాయిక లక్షిత, సఖీభావము, పార్శ్వ చారిణి, ఈర్ష్యామాన విప్రలంభ శృంగారము, కరుణాగసము)

పల్లవి :

చూడుడీ జోడద్దములపైని సన్నంపు–చుక్కలు గనిపించెనే

అనుపల్లవి :

వేడుక మదనసంగరమున నలసిన–జాడవలెనున్నది
జవ్వని వేడ్క– ॥చూడుడీ॥

1. జక్కువ పిట్టల చందమామ కూన – లెక్కిన వగజూచితే
చొక్కంపు బంగారు కుండలపై కెంపు – చెక్కినట్లున్నదే
జవ్వని వేడ్క ॥చూడుడీ॥

2. మిక్కిలి చీకటిని చిక్కుపడిన చందమామను గ్రమ్మట
చూచితే
మక్కువ తమ్మిపై ముసరిన గండుతుమ్మెద గుంపువలె
నున్నదే జవ్వని వేడ్క ॥చూడుడీ॥

3. మట్ల పల్లిసామి పగడంపు పై కెంపు – చెట్టున వగజూచితే
గుట్టుగ ఈరేయి మదనభండారము – కొల్లలైన
ట్లున్నదే జవ్వని వేడ్క ॥చూడుడీ॥

---

5. కాంభోజి - అట

(సామాన్య - ప్రౌఢ, విరహోత్కంఠిత, నాగ్విదగ్ధ)

పల్లవి:

తరుణి ! మరుశరములకు – తాళ లేనే

అనుపల్లవి:

వరుస వావియు లేని – వాడాయె నమ్మా ! ॥తరుణి॥

1. తల్లికిని తమ్ముడై – తన యత్తకును మగడై
అల్లునికి చెల్లెలిని – అమరనొసగి
బల్లిదుడై కన్నులను – పగలు రేయిగ జేయు
కల్లరికు డైనట్టి – ఘనుని ఇందు తేవే ॥తరుణి॥

2. చెక్కిట చెయి యిడి యలసట - చే వదనము కడువాడగ
వెక్కసమగు తా నుద్దిగ నెట్లు - వేడుక నడపుదును ?
అక్కర తీరగ నాతో - ఆడిన మాటలు తలచితే
ఎక్కడ పొగడుదును ? ధైర్యా - మే గతి
నిలుపుదును ? ॥తల॥

3. ననుకృష్ణా ! యని పేరొ్కని - నవ్వుచు కౌగిట మిక్కిలి
అనువుగ జిక్కితి నిక స - న్నడు గిడ నెనయుచును
తనుపులకలు నే నడుగగ - తామరసానన యెవ్వటి
చనవున నడపించిన యుప - చారము చందము
లెల్లను ॥తల॥

---

## 7. కాంభోజి - అట

(సామాన్య - ముగ్ధ. అధీర)

పల్లవి :

దయవాడని తెలిసి మనసు నొప్పించితే -
తరుణి ! దోసము కాదటే

అనుపల్లవి :

రయమున తమి రేచి నమ్మించి నన్ను జే -
రకువె ! తలపెట్టితివి ! అయ్యయ్యో ! ॥దయ॥

1. కలికి ! నీ మీద నే – కలవరమని నీతో –

పలుకరించుకో లేదా ? నాతో

అలుక చేసితే ప్రాణములు నిలుప లే –

నని యూనాడ తెలుప లేదా ? నా

నిలువెల్ల అమ్మల బొందలు జేసిన మగడు –

నీ పాలిటికి లేడా ?

ఇలలో వలచిన విభులను లాలించే

యింతుల జూడలేదా ? రా రాదా ? ॥దయ॥

2. మాట నిలుకడ లేని దానననుచు నే నే –

మారు విన్నవించ లేదా ? చిన్న

నాటనుండి నీ మీద మనసుంచిన నేరము –

నను జూచి తాళరాదా ? పలుకు

లేటికే మగవాడు పైబడి తిరిగితే –

ఎవరికి చౌక కాదా ? అయ్యయ్యో ! ఈ

ఆటవారమైన నన్ను బోనాడితే –

అది నీకే కొదవ కాదా ? నాతో వాదా ? ॥దయ॥

3. ?

## 8. సురట - ఆది

(సామాన్య - ఖండిత, మానవతి. నాయకుడు - వైశికుడు. ప్రణయ మాన విప్రలంభ శృంగారము; అద్భుతరసము)

పల్లవి :

దానిబోధన వినవద్దురా

అనుపల్లవి :

నన్నుబాయ న్యాయమా ? అది నీకు ప్రియమా ?
నన్నేలర ! బృహదీశ్వర ! ॥దాని॥

1. వద్దజేరి ముద్దుపెట్ట వచ్చితే
గద్దరించి మోమోర జేసేవు సామి ! ॥దాని॥

2. అదేర ! భళి భళిరా !
ఔ రౌర ! ఇది మేరా ? పో పోరా ! ॥దాని॥

3. ?

---

## 9. కేదారగౌళ - ఆది

(సామాన్య - ప్రౌఢ, అన్యాసంభోగ దుఃఖిత)

పల్లవి :

నే నేల మరులైతినే - ఇట్లా వానికి ?

అనుపల్లవి :

వాని వంచన తెలియక - వనితా ! నే మోసపోతి ॥నేనేల॥

1. మాటలాడి తెలుపవే – మనసులో మర్మము
బోటీ ! వింతగా – బొంకేవేమే ?
ఏటికే ఈ వాడు ? – ఎలనాగ ! ఇందరిలో
నాటి వలెనే నీవు – నవ్వుచు మాటాడవే ॥నే॥

2. సంగతి కాదే యిది – సరసు రాలవే నీవు
అంగనా ! తెలుసుకోవే – అతివేగమే
ముంగరకైనా యీ – మురుపు ముత్యము
శృంగారి ! నీ కెమ్మోవి – చెలియుని ఆన నీవే ॥నే॥

3. గబ్బిగుబ్బల పైని – గౌరవమున నన్ను
ఉబ్బుతమి రతిని – ఊరడించి
గొబ్బున ముద్దు వరదుని – కోరిక చెల్లగా నీ
అబ్బురపు వగల – అతివ నన్నేలవే ॥నే॥

---

## 11. సావేరి - అది

(సామాన్య - మధ్య, ధీర, ఖండిత; అన్యాసంభోగ దుఃఖిత)

పల్లవి :

పూసలోని దారము వలె ఎంత
చేసెనే నమ్మినందుకు !

అనుపల్లవి :

మోసమేమని యడిగితె తగని
రోసమే వేణుగోపాలుడు ॥పూస॥

1. ఎనతి యింటికి పోనని పిల్చి
ఎదురెల్లు వచ్చి వచ్చె ఘడియలో
శివ శివా! ఇతని మోము చూచితే
సేతు యాత్ర పోయిన తీరదు ॥ప్రూస॥

2. అటక మీద సరిగె చీర చాటున
ఆపెకచ్చి సేవించుకొనె నట
కటకటా! ఇతని పేరు తలచిన
కాశి యాత్ర పోయిన తీరదు ॥ప్రూస॥

3. నాయిక సానుల సంగతి నిమిషము
బాయలేక కలసి వచ్చి సన్నిటు
మాయచేసి కూడినందు కిక చాల
ద్రాయణం బాచరించినా తీరదు ॥ప్రూస॥

---

12. కాంభోజి - ఆది

(సామాన్య - ప్రౌఢ, అధమ)

పల్లవి :
పో పో పో యీ ఈ కొత్తమోహం - పుణ్యా మేమి ?

అనుపల్లవి :

1. ఇంత కుండ పాలు పితికే – ఎనుము లున్నవి ; నే
సంతరించిన తూముకూరి – సన్న బియ్య మున్నవి
చింతించక రెండు పెట్టెల – చీరె లున్నవి ఇదిగో !
దొంతుల కందిబేడలు గో – ధుమ లున్నవి ॥పోపో॥

2. నీ మీదనె మంచినూనె – నెయ్యి ఉన్నవి
నే మానంబు దానగాను తే – నె చక్కెర లున్నవి
కామించిన వగల యూర – గాయ లున్నవి నె
యామర పొగాకు వక్కయే పొ – ద్దైన నున్నవి ॥పోపో॥

3. సంచుల అయిదింట నిండ – శనగ లున్నవి నే
పంచిన వస్తువులు వెండి – పైడి కొంత యున్నది ఇదిగో !
* * * * *
మంచి కదంబ కస్తూరి జవ్వాదు లున్నవి ॥పోపో॥

---

## 13. గౌళిపంతు - ఆది

(సామాన్య - ప్రౌఢ, ప్రేమాధిక్య)

పల్లవి :

బాల నెంచేది నీకు చోప్పా ? దీన జన
పాలుండ ! నేటి పద్దేల ?

అనుపల్లవి :

వేగమె రారా ! యాల యాంచ
మోదక శైల వాస ! (మువ్వ ?) గోపాల ! ॥బాల॥

1. అరుళాళ ! అపుళాళ ! మేమిట్లు -
        లహో రాత్రులు మిమ్ము
    గరిమతో దలచంగ - కరుణించ రాద !     ॥భావ॥

2. అంచితము దేవతలు - అందరును మిము సే -
        వించి కా దనుట అన్నిట
    మించిన వేద వినుత ! మమ్ము కరు -
        ణించేది మీ ఘనత     ॥భావ॥

3. నీవు ఏనుగు కొండ - నెలకొని వరద పెరుం -
        దేవి గూడుక నుంటివి వేడుకతో
    నా విన్నపము వింటివి మమ్మో -
        దేవ ! ఏలుకొంటివి పో     ॥భావ॥

---

## 15. కాంభోజి - రూపకము

(సామాన్య - ప్రౌఢ, విరహోత్కంఠిత)

పల్లవి :

మందుల మహిమే మటుమాయ నా
    మాటంటే కూడదట వే

అనుపల్లవి :

మందె మేలమున మరచెనో ? లేక మగువరో ఏ -
    మందు నే ? మ్రొక్కేను ; రమ్మన వే !     ॥మందు॥

1. ఆటాడి నలచిన వలపులు భూమిలో –
అయ్యో లేదు కాదె ?
వాటమైన మగవాడు దొరికేని –
వ్రాత ఫలము గదవే? ॥మందు॥

2. ఆనాడే తెలియనైతి – అమ్మచెల్లా ! ఈ –
పానుపు పాలాయె నా ప్రాయ మెల్ల
కాని పోసి దాని వావే – కడవెళ్ళ సుఖము –
కాని నైతి నించుకైన ॥మందు॥

3. హాయి లేని కానుపుట్టు – కాయె నమ్మా ! –
మాటః సుసుని కొప్పగించ నాయెనమ్మా !
పోయెగాని చెట్టుపట్టు – దాయెనమ్మా ! –
పోయుదాసి విరహాము మిగు –
లాయమునమ్మా ॥మందు॥

---

## 16. సారంగ - అట

(స్వీయ - ప్రౌఢ, సౌందర్య గర్వితే. హాస్య ధారిణి మనసారాలాప)

పల్లవి :

మగువ (తను వెన్న) నే – మాడిక్కనుండె ?

అనుపల్లవి :

సొగసునకు పుట్టిల్లు – చొప్పనగ నుండె ॥మగువ॥

1. నెలత పయ్యెద లోన – వలుద పాలిండ్లపై
నెల వంక లే రీతి – నెలవు మీరె ?
వలరాజు అపరంజి – కలశము వెలయించి
వలనొప్పగా డాగు – వ్రాసిన ట్లుండె ॥మగువ॥

2. తావి మించిన యట్టి – తరుణి వాతెర కెంపు
భావించి చూడ నే – పగిది నుండె ?
భావజు డమృతమెల్ల – పదిలంబుగా గట్టి
వేవేగ తాముద్ర – వేసిన ట్లుండె ॥మగువ॥

3. సికుల నింపొందు మా – శ్రీకృష్ణుతో నింతి
పరివి పెనగంగ నే – కరిణి నుండె ?
అరయ నీలపుసరులు – అపరంజి సరిపెణయు
సారిది మారుడు పెనచి – చూచిన ట్లుండె ॥మగువ॥

---

## 17. శంకరాభరణము - అట

(స్వీయ - కలహాంతరిత. నాయకుడు - అనుకూలుడు. విరహ విప్రలంభశృంగారము)

పల్లవి :
మానినీ! వినవే నే మందబుద్ధితోను –మాటాడక యుంటినే

అనుపల్లవి :
మానమే భూషణము – మానవతుల కెల్ల
మాన మెడలిన వెనుక – ప్రాణ మేటికే ?
చెలియ ! ॥మానినీ॥

1. అత్త మెత్తనిది మామ ముసలివాడు
ఉత్తముడైన బావ - ఊరలేడు
సత్యము నా మాట - సవతిపోరు లేదు
ప్రత్యేకము ఇళ్లు - పై కావలీ లేదు ॥రారా॥

2. మొగుడు జంజకి గాడు - మొత్తిన తిట్టడు
తగుల బట్టి కాని - తలచలేడు
మగనాలి నే నని - మనసున నెంచకు
పగలైన రా యే - పసుచు సందడి లేదు ॥రారా॥

3. మరదులు నే నంటే - మాటాడ వెరతురు
ఎరిగిన వివరాల - కే మనరు
నెరజాణ ! వేణాంగి - నిలయుడా ననుగూడి
సరగున నీ కొక్క - సంతానమే కాని ॥రారా॥

---

19. మంగళకైశిక - అట
(సామాన్య - ప్రౌఢ, వాగ్విదగ్ధ)

పల్లవి :
లంజరికము మాను మీా చెలువ కృష్ణ !

అనుపల్లవి :
చంజి (?) మధురాపురి - తంజావూరి వలె తలచకు మీా
పంజె తోలురాయ - పాళెము లంజలు
కంజదళేక్షణ - కలికి చెలువ కృష్ణ ! ॥లంజ॥

1. వాడి నాకులును – వక్కాలు నమరించి
విడెమిమ్మాయె – నేను నవ్వుచును
కోడె నామము దిద్ది – కొప్పు పెట్టుకొని
వాడ వాడల నిన్ను – నలుగుపు జూపేరు ||లంజ||

2. ఈ సొమ్ము లెస్సా ? – ఇదిగో నీ మానాని
ఆసతో పరియింతు – నేటిలు మానివీటి నిన్ను
మోసపుచ్చి పక్క – వేసుకొని నిన్నింటి
దోసానికి వెరవక – దోచి పొమ్మందురు ||లంజ||

3. ?

---

## 20. మోహన .. రూపకము

(సామాన్య - ఖండిత)

పల్లవి :

వచ్చితివా నాతో – వాదులాడ ?

అనుపల్లవి :

ఈ ముచ్చు వగలకు – నే మొక్కేరా వరాహా ! ||వచ్చి||

1. మందయాన యింట నిన్న – మాపటివేళ మోవి
విందారగించి నీ విటు – విలాసముతోను ||వచ్చి||

2, మొగ్గల తీరైన దాని – నిగ్గు చన్ను లదిమి
బిగ్గ గుమ్మనైన రొమ్ము – తగ్గులతో నిపుడు ||వచ్చి||

3. అంబుజవల్లి పతియైన – యాదిమూర్తియో
కంబుకంఠి రా రమ్మని – కలిసేనని నేర్పిన ॥వచ్చి॥

---

## 21. భైరవి - చాపు
(సామాన్య - ప్రౌఢ, సురతప్రియ)

పల్లవి :
వనిత వగవగ నుపరి సురతము – వర్ణమై
యే తెంచె నిప్పుడు

అనుపల్లవి :
మనసు భ్రమయో లేక యిది యల
మరుని మాయ విచిత్రమో ! ॥వనిత॥

1. సొగసు కురులను మొయిలు ముఖమను
సోము నందము నెల్ల గప్పెను
పొగరు కనుబొమ లింద్రచాపము
పోలుపు దాల్చుచు మీరెను
మిగుల నతివ గళనిశ్వాసము
మేటి పవనుడు విసరసాగెను
మగువ నడుమున తీగ మెరుపులు
మాటి మాటికి మెరసెను ॥వనిత॥

2. కలికి చిలిబిలి కోయిలని పలుకులు
గళ గహ్వరమున ఉరుములురుమును
కలికి ముత్యాల సరులు ముడి విడి
ఘనముగా విడగిల్లి రాలెను
కలయికల చిరుచెమట వానలు
కనక కుచ గిరులందు కురిసెను
నెలవు కొను స్వేదముల కోనేరులు
నిండి మధ్యగా పారెను ॥పలు॥
3. ?

---

22. పంతువరాళి - రూపకము
(స్వీయ - మధ్య, విరహోత్కంఠిత)

పల్లవి :
విన్నవించరమ్మా ఓ చెలులారా! – విన్నవించరమ్మా!

అనుపల్లవి :
నిన్నుబాసి చింతలో కరగి – కన్నీరు నింపుచున్న దనుచు
కన్నెలార! నా దీనత – కరిగిరి వరదుని తోనే ॥విన్న॥

1. వనితపై నలనాటి నెనరెందు బోయె? నేల
కినుక? మరుని కొప్పగించితివా? యని ॥విన్న॥

2. మగవారిని చెలులు నీవల్ల నమ్మి - దగదన వలసె నేడు
సొగసాయెనా ? యల - సుదతి మాయ లయ్యెయ్యో !
నగుప కిచ్చిన బాస - మరచితివా ? యని ॥విన్న॥

3. ఘన యోగపురి సామజవరదా ! నీవు
కన్నుల గట్టిన ట్లగునా ?
మనసున నున్నట్టులుండి - మరి కౌగిట లేవు
గనుక న్యాయముగాదు - కలికి నేలరా ? యని ॥విన్న॥

---

23. కాంభోజి - ఆది
(స్వీయ, ప్రౌఢ, స్వాధీనభర్తృక)

పల్లవి :
సదయుడైన మా మదన గోపాలుని
చను వందరికి దొరుకునో దొరకదో ॥

అనుపల్లవి :
పదవే అలవాని చెలిమి - బలవంతము గదవే ॥సద॥

1. ఆట ప్రాయమునాటి మక్కువ
అదివరకు ఉండేదే యెక్కువ
నేటికి విడనాడేదే నిక్కువ
అతివరో వినవే అందరికిని తక్కువ ॥సద॥

2. అస్త్ర ఘాతములవలె నున్నాయిగదే
ఆడినమాట తప్పని నాప్రాణేశుడే
నను బాసి యే వనితను గూడెనే
నాపై నెనరు ఏ నాటికి లేదే ||సద||

3. అంతరంగము తెలిసిన వాడగదే
ఆ సుమబాణుని మించిన వాడగదే
కంతుకేళిని సన్నలు దయ్యాడగదే
ఘనుడైన మా సదన గోపాలుడు ||సద||

---

## 24. సౌరాష్ట్ర - ఆది
(స్వీయ - ప్రోష ప్రేమాధిక్య)

పల్లవి :
సాముచేసెనే మా వరదరాజులు – సాముచేసెనే

అనుపల్లవి :
సాముచేసెనే దొడ్డప్రేమతో సురలుపొగడగా
సామజవరదుడు సామి పగరుల గెల్వగా ||సాము||

1. దట్టి బిగించుక దండెలు దీయుచు
చుట్టుకొ పరువడి
దిట్టగజేయుచు పట్టుచుకొంత
కట్టులాడు సం – గడములు దిప్పుచు ||సాము||

2. పట్ల గంధమును - జెట్ల గొప్పయును
పట్ల కోపమును - జెట్లవలెనె కా
గిట్లను పొరలే - టట్లను పెసగే
టట్లను ముట్టి - ట్టట్టే వెనుకను ॥సాము॥

3. కడువడి మీరగ - కటారి కోలలు
పటుతాళంబులు - పట్టుచు చెమటలు
పుడమి గుహారి (?) పుణ్యకోటి వైరికి
పట్టడ మియ్యక - పగతురు తొలగి బడ ॥సాము॥

---

## 25. ఆనందభైరవి - ఆది

(పరకీయ - ప్రౌఢ, తృప్త)

పల్లవి :

సొక్కుచు సోలుచు - సుందరి వచ్చే
సొగసు చూడరమ్మా కొమ్మా !

అనుపల్లవి :

చొక్కపు టరవిరి - సురటిని చేకొని
చక్కని కృష్ణుని పక్కన రాతిరి - సరిసరిగా కలిసిమెలసి
॥సొక్కు॥

1. కుసుమాయుధు నర్చించు తెరంగున
        కొప్పున విరు లొకటొకటిగ జారగ
విసువక నేసిన జాము చందురుని
        వితమున ముఖకళ వెల వెల బోగ
కొసరి కొసరి తన యూరికె వెడలగ
        కోకల కొరికె కొరికె తన మానిని
పసగల తలిరుల నీవిని ననుగల
        రస జనకంబగు మోవితో కడు
        రాజిల్లెడు మైతావితో
ఒసపరి నిద్దుర కంటి జోకతో
        ఒంటికట్టు ముడి సడలు కోకతో
మిసమిస లనుచును - మిట్టల మీదను
        పసుపు నిగ్గుగల - పయ్యెద జారగ ॥సొక్కు

2. గగన తలంబున సంధ్యారుణ రుచి
        కలసిన చుక్కలు పెనగొని జాడ
బిగి బిగి రత్నసరమ్ముల పొదలుచు
        చిక్కువడిన హారము లసియాడ
మగువ నడుము కుతికిలబడి మృదు కుచ
        యుగ భరమున కలికి నడలు బెళుకుగ
మొగమున నెర నెల తగిలిన రోహిణి

నగల ముంగురులు నటించగ
ప్రియ వాక్యము చిలుకను మించగ విని
మగుడ రతాశలచే నించగ సల
మరుడు శరంబుల ముంచగా
నగధరు కనుకొని నగు ప్రేగంటను
చిగురుబోడి కడు - సిగ్గున మెల్లనె ॥సాకు॥

3. చల్లని మంచు తెరంగున భాసిలు
చందు పసిండి యరంటుల లీల
తెల్లని వలిపపు పావడలో తొడ
లుల్లసిల్లగల నిగ నిగ మని చాల
మల్లె బంతి పెట్టి పావలు
మురువు మీద మెట్టి అందెలు
ఘల్లని మ్రోయగ శృంగారరసము
వెల్లి విరిసి పారగా తన
యుల్లము వెన్నుని గోరగా నెల
పిల్లలు చెక్కుల మీరగా
నల్లని సామిని నలినదళాక్షుని
మల్లికార్జున సమానుని
పెనగొని వరదా యని ॥సాకు॥

వడి నడిగ తెల్లనాకు మడుపులు
ముడుపులుగ మడిపించి నే నా
నిడుపుగల పూసటులు క్రొమ్ముడి
ముడువ పనిపడి గడితి నివిగో ॥అక్కట॥

3. ఈనాడు కూడెడు ఏ సతీపతులును మ
రేనాటి కెడ బాయక యుందురని పలికి
తే నది సడ్డ సేయక యుంటి వింక
గానిమ్ము తడవింక సేయక
పోనీ పోనీ వచ్చితి నీ
పుణ్యమాయెను లేర రంగడ
సూన శరు సంగరములో నిను
సొక్కజేతుర సింహపురవర ॥అక్కట॥

2. కాంభోజి - ఆది

(సామాన్య - ప్రౌఢ, విరహోత్కంఠిత)

పల్లవి :

అక్కరో ! నేను వానికి – మ్రొక్కి వేడుకొంటి నని
గ్రక్కున తోడి తేవే ఓ – చక్కెర బొమ్మా !

అనుపల్లవి :

ఎక్కువైన కృష్ణదేవుని – అక్కున జేర్చి హాయిగా
చక్కెర మోవిని నేను – నొక్కవలె
నంటి నని ॥అక్కరో॥

1. మిద్ది మీఁది పరుగులు – మీసాలపై తేనెలు
కొద్దికాలమే కాని – కొనసాగు నటమ్మా !
హద్దు మీరి అర్థరాత్రివేళ – నాడ కేగుచుండ
ప్రొద్దుగాని ప్రొద్దు వేళ – పోవరా దంటినమ్మా ! ॥అడు॥

2. పగ లొక్కనాఁడైన కంటి – కగుపడి నే నెరుఁగనమ్మ !
తగులుమారి యొకతె బాగ – తగులుకొనె గదమ్మ !
సొగసు మీరి సొగసు చేసి – మొగము చూచు
చుండు నమ్మ !
మొగము నద్దము లున్నవమ్మ – మొగమాట మేలనమ్మ!
॥అడు॥

3. పెరటి చెట్టుమందు మీఁద – ప్రియముగలుగునగునటమ్మ!
పరులు పెట్టు నెట్టిదైన – పరమార్థము కాదుటమ్మ !
ధరను సింహనగర రంగ – ధాముని నిక నమ్మకమ్మ !
మురిపెము లిక మానుమమ్మ – తరిలిన మరి దొరకదమ్మ!
॥అడు॥

## 5. ఆనందభైరవి - అట

(స్వీయ - ప్రౌఢ; తన దుస్థితి చెలికత్తెతో చెప్పుకొనుట. కరుణా రసము పదమంతటను గలదు)

పల్లవి :

ఆడు దాని జన్మమయ్యో! – అన్నిటికంటె నధమము
కాదటవే!

అనుపల్లవి :

ఈడు రాక మునుపే – ఏమో యెరుగని
నాడే వక్కడు మెడను – త్రాడు గట్టెనమ్మా
చేడెరో! ఇట్టి అన్యాయం – బేడనైనను జూడగ
గోడిగము గాదె? పెనిమిటి – కుంటియైన
కురూపియైన? ॥ఆడు॥

1. తల్లిదండ్రుల నన్న – దమ్ముల నక్కల చెల్లెళ్ళను విడిచి
వల్లభునే దైవముగా నమ్మి – వాని యిల్లు చేరిన
పిదప ఏమందు మనపాలు
కల్లలే? పుట్టింటి వారిని – గాన బోవలె నంటిమా అది
వల్లకా దని చెప్పుదురు! – పగవారి కైనను
వలదు గదవే ॥ఆడు

## 6. సహాన - చాపు

(స్వీయ - ప్రౌఢ, విరహోత్కంఠిత, అయోగ విప్రలంభశృంగారము, కరుణ)

పల్లవి :

ఆడుదాని జన్మమెత్తిన ఫలమేమి ? అతివరో ! వ్యర్థమమ్మా

అనుపల్లవి :

మేడలు మిద్దెలు – మెండు గలిగిన నేమి ?
ఈడైన విభునితో – నెనసి యుండకపోతే ॥ఆడు॥

1. అతివ మిక్కిలి రూప – వతియైతే నేమి ?
సతతము పతిభక్తి – సలిపితే నేమి ?
అతులిత వ్రతములు – ఆచరించిన నేమి ?
పతితోడ హితవుగా – పలుకు లేక పోతె ॥ఆడు॥

2. వెల విరి వస్త్రాలు – వెయ్యి గట్టిన నేమి ?
సలలిత నవరత్న – సరులు పెట్టిన నేమి ?
కలిమి అందరికంటె – కలిగి యుంటే నేమి ?
ఫలకాలమునాడు – పతిని గూడక పోతే ॥ఆడు॥

3. కస్తూరి గంధము – కల్పి పూసితె నేమి ?
విస్తారముగ – విరహ ముండిన నేమి ?
శిస్తుగ పువ్వులు – శృంగారించిన నేమి ?
కస్తూరి రంగని – కలసి యుండక పోతే ॥ఆడు॥

## 8. సౌరాష్ట్ర - ఆది

(స్వీయ - నవోఢ, విరహోత్కంఠిత. విరహ విప్రలంభ శృంగారము, కరుణ)

పల్లవి :

ఇంతి వినవే! యీ రాజశేఖరుం డెవడో తెలుపరా దటవే!

అనుపల్లవి :

కాంత! ఈతడు బంగారేచ ధరణీ - కాంతుడో?
జయంతుడో? శ్రీమంతుడో?

1. చాన వీని నెమ్మోము పున్నమ - చందమామ చందము మీరు
వీని కన్నులు వెలిదమ్మి రేకుల - విధమున నలరారు
తేనె లొల్కు సుధజిల్కు వీని - తేటలైన మాటలు సౌరు
వీని మేని కాంతులు వేమారు క - డానిగేరు గదవే
నే నేమని దెలుపుదు నీతని పెన్నెరు లందము
అళిబృందము చందమును
కౌను కే సరి కేసరియానన గదనరు యీ చెలువము
యువతీ
మానస తోషణమై కనుగొను
మానవులకు నేత్రోత్సవ మయినది ॥ఇంతి॥

9. హిందూస్థానీ కాఫీ - ఆది
(స్వీయ - స్వాధీన పతిక, సంభోగశృంగారము)

పల్లవి :

ఎందుకు రా కోపము ? మదన జనక !
ఏమి మనసున దోచెరా ?

అనుపల్లవి :

?

1. గ్రక్కున నను నీ - కౌగిట జేర్చవు
చక్కని మోవి చురుక్కున నొక్కవు ॥ఎందుకు॥

2. సరగున సమరతి - సల్పగ దలచిన
గురు కుచములచే - గ్రుమ్మితి నని యా ?
॥ఎందుకు॥

3. ధర శేపల్లె పురవరా ! నీమది - కరుణ చూపి
మరు కేళి గూడరా ॥ఎందుకు॥

---

10. ? ?

పల్లవి :

ఎన్నడు ఈ మోహా మనే - దెటువంటిదో యెరుగ

అనుపల్లవి :

నన్నున్నచోట నిమిషమైన - నా ఉండ నీయదు
వన్నెకాడైన కైలాస - వాసుని రూపమే చూచి -
వలచి మైమరచి యుంటినే ఓ యమ్మలాల ! ॥ఎన్న॥

1. కేలన పాలు చెక్కెర పెట్టి పెంచిన చిలుకకు
నే నేమి చేసితి ?
మారు ములుకులకై – నోరు మూసితి సమ్మా! ॥ఏడ॥
2. చాల నేర్పున బన్నిస యీ మెడ – తాళివల్ల కొంత
తాళితి వడజాతి కాకల తాళ జాలితి భువి –
పొలుపొందనికి సోలితి సమ్మా ॥ఎడ॥
3. కందర్పుని లీల గలసెనే – కాముడై యందమైన
వరదు డిప్పుడు
ఎందును దయగల డిప్పుడు నా – డెందుంకి వచ్చెనో
ఇప్పు డో యమ్మా ॥ఏడ॥

---

## 12. గౌరీపంతు - చాపు

(సామాన్య - ఖండిత, మధ్య ధీర. నాయకుడు - ధృష్టుడు. ఈర్ష్యా మాన విప్రలంభశృంగారము, రౌద్రము)

పల్లవి :
ఏ రీతి బొంకేవురా ? ఓ రోరి ! – ఏ రీతి బొంకేవురా ?

అనుపల్లవి :
ఏ రీతి బొంకేవు ? ఇదిగో ! నీ భుజమున – దేరిన పసపు
నిగ్గులు ; నీ మేనల జారిన కుంకుమ జక్కులు
నీ రెప్పలపై పేరిన కాటుక కగ్గులు వేణంగిరాయ ! –
రారా యేటికి సిగ్గులు ? ॥ఏరీతి॥

## 13. బేహాగ్ - రూపకము

(పరకీయ - ఖ్యాతి గర్వవన యగు సాహసిక. నాయకుడు - ఉపపతి. భయానకరసము, సంభోగశృంగారము)

పల్లవి :

ఒకటే మాటాడ బలిమిని - ఒప్పుకొంటి గదరా? ఆపై
అకటా! నే - నోప జాలరా!

అనుపల్లవి :

ఎకసక్కెము గాదురా లేరా - ఎంతసేపు సహింతురా?
పక పకమని నవ్వేరురా - పరులు రాబోయేరు
సామి! ||ఒకటే||

1. మొగము మొగముతో జేర్చి - ముద్దుపెట్టుటంతే కాని
చిగురు మోవి పంటి గంటు - సేయబోకురా
తగు మాత్రము మొలక చన్ను - బొగడ లంటుటంతే కాని
నగుబాటగు చేతిగోరు - నాట నీయ బోకు సామి! ||ఒకటే||

2. ఇంతదాక మగవానిని - ఎరుగుదునా నేడె కాని
ఇంతటి తడవైన బొంక - ఎటుల నవునురా సామీ!
ఇంతె కాదు నేటి రాత్రి - కింటి యాతనితో నన్ను
మంతనమున గలుప బూన - మాటలాడు
చున్నవారు ||ఒకటే||

3. ప్రొద్దు మాపు [illegible] - [illegible] వచ్చు
నట్టు తేసె పోయి వత్తు - చాలింపుమురా
పెద్దలు విని [illegible] - [illegible]
[illegible] - [illegible] ! [illegible] !

[illegible] ||[illegible]||

---

## 14. ముఖారి - ఆది

(సాహిత్యం - [illegible] ప్రొ. నాయని సుబ్బారావు [illegible] రసము)

పల్లవి :

కాంక్ష పోయెననే నీ వలననే - కాంక్ష పోయెననే

అనుపల్లవి :

ఓసోసి నా మది నన్ను అట్టుల నీవు - ఆశ తెల్ల నిరాశ
చేసుక పదే ||కాంక్ష||

1. ఏ తీరు నైనను - ప్రీతి సేయుదు నని
పాతకిచే చాలా - భ్రమసి తిరుగుచుంటిని
రాతి మనసుగల - నాతి వీ వనుచును
నే తెలియక మోస - పోతినే వేసారి ||కాంక్ష||

2. చక్కగాను నీవు - సంతోషముగ నాతో
ఒక్క మాటాడిన - తక్కువ ఏ నీకు

ఇక్కడి భ్రాంతిచే – ఇల్లాలిని బాసి
దిక్కు దెసయు లేక – తిరిగి తిరిగి రోసి ॥కాశి॥

3. ముద్దుగుమ్మ! మన – మిద్దరి కూటమి
ముద్దు నట్టేశ్వర – మూర్తికె తెలుసును
సుద్దు లెంచకుండు – సుదతి నీ వనుచును
పద్దుచేసి నాతో – పలుకవు గనుక నే ॥కాశి॥

---

## 15. దర్బారు - అట

(స్వీయ - మధ్యాధీరాధీర, ఖండిత. నాయకుడు - ధృష్టుడు. సఖి పాత్ర్యాచారిణి. మాన విప్రలంభశృంగారము, కరుణాద్భుతరసములు)

పల్లవి :

గడియ గడియ కటువంటి – గారుపములు తగునటమ్మా!

అనుపల్లవి :

పిలిచిన మారాడడమ్మా! అదియేమో కోమ్మా!
నుడువ తరము గాదె వాని – నడతలు నాతోడు సుమ్మా!
విడిచిన నిక దక్కడమ్మా – వీథి కెక్కవలయు
నమ్మా! ॥గడియ॥

1. కరుణమాని కనుల యెదుట – కాంతలతో సరసమాడ
గరిత! యోర్వ వశమటమ్మ – గట్టిగ వినవమ్మా!

## 16. కురంజి - త్రిపుట

(పరకీయ - విగహోత్కంఠిత ; అన్యాసంభోగదుఃఖిత. నాయకుడు శఠుడు. విగహా విప్రలంభశృంగారము, కరుణ)

పల్లవి :

తలచుకొంటే తాళ జాలనే ఆడు–దాని జన్మ మిక చాలునే

అనుపల్లవి :

లలన! వానికి సతమాయెనే కై - లాసపతి యిందు
రాడాయెనే ॥తలచు॥

1. మగువా! ప్రేమతో జేరవచ్చెనే ఆకు
మడుపు పంట నొక్కిచ్చెనే
సొగసు కెమ్మోవి యాన నిచ్చెనే వాని చూడ చూ
డగ తమి హెచ్చెనే ॥తలచు॥

2. పాయరాని వలపాయెనే నా
పతి కింత దయ లేక పోయెనే
కాయజుని రాపాయెనే యా
కలికి వానికి సతమాయెనే ॥తలచు॥

3. దారల ఎలపు లేటి శతములే? అవి
దారికేది తొలి నోము ఫలములే
తిరుగ సేచుట వారి మతములే అవి
తెలిపెద నంటే భారతములే ॥తలచు॥

4. అలిగి రాడేమి సేయుదునే ?
అమ్మలారా ! నా వలపెల్ల బాయునే
వెలది ! యీ దినమెట్లు ద్రోయునే ? ప్రాణ
విభునికి కెన్ని కమ్మలు వ్రాతునే ? ||తెలచు||

5. గాయము మీరిన సిరి తోటలో నుండి
గురుదస్త్రము గాంచిన మేడలో
సమయము మీరా కైలాసపతి నన్ను గూడునే ! యీ
వనజాక్షిని తెలుగ పెండ్లాడునే ! ||తెలచు||

---

## 17. నాటకురంజి - ఆది

(స్వీయ - సుపర్ణ, విరహోత్కంఠిత. విరహ విప్రలంభ శృంగారము, అమృతరసము)

పల్లవి :

పేరు బెట్టి యున్నారు రంగనికి -
పెండ్లి సేయు టున్నదటకో తెలియదు

అనుపల్లవి :

ధరణి దొర బిడ్డలను బుట్టుట పగవారికైన -
కొరగాదమ్మా ! ||పేరు||

1. తలిదండ్రుల మతిచే కొన్నాళ్లు - తలచుచు తరి జూచుచు కొన్నాళ్లు
కుల ధర్మములు విచారించుకో - వలె ననుచు కొన్నాళ్లు

అలరు పాయుములు పరి - మెళపు విరుల విధమాయెగా
విధి మాయగా ఈ ధరణి - పేరు బడ మన్నారు
రంగని ॥పేరు॥

2. మగని సుఖ మెరుగక కొన్నాళ్లు - మరియాదల కొరకై
కొన్నాళ్ళు
నగరి వారమనేటి బింకముల - నాశెంబులు వెదకుచు
కొన్నాళ్ళు
పొగరు తమక మహవిగాయు వెన్నెల - పోలిక తుద జాలి
కయ్యే నిది ॥పేరు॥

3. అరమరిక తోచి తోచక కొన్నాళ్ళు - అనుభవ విధ
మెపగక కొన్నాళ్లు
సరసముగా రతికేళి ముచ్చటలు - సఖియలచే చాలా
విని కొన్నాళ్లు
అరెరె ! ఆసుతనమే వగ జేసేదై - అలసితినే
సొలసితినే ॥పేరు॥

---

## 18. కన్నడ - ఆది

(స్వీయ - ప్రౌఢ, ధీర, ఖండిత. నాయకుడు - ధృష్టుడు. ఈర్ష్యామాన విప్రలంభశృంగారము, హాస్యరౌద్రరసములు)

పల్లవి :

పోరా! ఈ వగ లేలరా? చాలు–పోరా ! ఈ వగ లేలరా?

అనుపల్లవి :

ఏరా ! ఈ నడత సరేరా ! మంచిది తెలిసేరా !
ఈ వగ లేలరా ? ॥పోరా॥

1. చిన్ననాడె వాడు నన్ను చేపట్టి - మిన్నగాను కలసి
వెలసి యున్నట్టి
చిన్నెలన్ని చూచి యిపుడు చలపట్టి
వాన్నెలాడి వాని కెన్నెన్నో బోధించెనే అతడు
నిన్న దాని గారవించెనే అది నన్ను మించెనే
వలపించెనే
నన్నుతాంగిరో! యేమి సేయుదునే ఇక - నెన్నటికి
నా సామిని
కౌగిటికి డాయుదునే ఒకసారి వాని
కన్నె నీ వన్నిటను నేర్పరి - వెన్న నీకు నసాధ్య
మే మున్నదే? యీ
మన్నె దొరతో విన్నపము చేసి యీ రాతిరి
॥బో॥టి॥

2. ఎమ్మెకాడు వచ్చునని నిదురలేక - యెదురు చూచి
వేసారితి యిందాక
అమ్మచెల్లా! చలువ వన్నెల కాకలాయె నింక
నిముషమైన నోర్వజాలనే జాలంబు లేలనే? యిక
తాళ లేనే
సమ్మదమున గూర్చనిది భారమా? యీ

1. నిద్దంపు గుబ్బల పైని – నెలవంక లుంచిన గని
నిద్దుర రా దేమి సేతు ? – నెన రేల్లు దాతు ?
ఒద్దికతో నీ కౌగిట – నుండక చేర దూరట
ముద్దుగుమ్మ ! పరాక ? – మ్రొక్కేనే మా
యింటిదాక ॥రావే॥

2. బాలరో ! నే మనజాల – పలుమారు లలయించ
మేలా ? ఈ లాగు నన్నే చే వేల ? ఇంతి యీ వేళ ?
నాలాయముగా నీ కేను – వలచితిని తాళలేను
మేలు వాడను చాలా – లాలించవే ఇకనైన ॥రావే॥

3. చెలగి కందాళ వారింట – వెలసిన గోపాలుడ
వలపు కాయని కేళి – కలసి నన్నేలి
తలపవు నేడింతైన – తరుణీమణి ! దయతోన
వలపు మించవే నీ యాన – కులుకు మోవి
తేనెలాన ! ॥రావే॥

---

## 21. యదుకుల కాంభోజి – ఆది

పల్లవి :

వింత వింత లెల్ల వినవే – దంతి గమనరో

అనుపల్లవి :

కాంతామణి నీ నీలవేణి – కాముని రాణి ॥వింత॥

1. నోరు తేసి పాలు తాగు సుడిసె నమ్మా ఒక
నొంకి (?) వాడు వింతలెల్ల ఆడెనమ్మా ॥వింత॥

2. చేరి మూగవాడు శ్రుతి గూడెనమ్మా!
చెంత గ్రుడ్డివాళ్ళందరు చూచేరమ్మా ॥వింత॥

3. విత్తులేసి భూమిలోను చెట్టు పుట్టెనమ్మా!
వింతగా రెండు శాఖ లాయెనమ్మా! ॥వింత॥

4. ఆకున కొమ్మలు ఆరు గలిగెనమ్మా!
అంతట పూలు వింత కాయ లాయెనమ్మా! ॥వింత॥

5. వృక్షము మీదనే యుండు — పక్షి కాదమ్మా!
అక్షులు మూడు గలిగుండు — హంసను గాదమ్మా!
సూక్ష్మముగ జలము మోచు ఘటము కాదమ్మా! ॥వింత॥

---

## 22. యదుకుల కాంభోజి - అట

(స్వీయ - అజ్ఞాతయౌవన. నాయకుడు - అనుకూలుడు. సంభోగ శృంగారము, అద్భుతరసము)

పల్లవి:

సుదతులందరు నీకు — శోభన మని యంటే —
అదియేమో — నను కొంటినే

అనుపల్లవి:

సదయుడు శయ్యపై — చక్కగ పవళింప
పద పద మని వాని — పక్కకు పంపిరి ॥సుదతు॥

1. చెలియరో ! శయ్యపై - నిలువ సిగ్గై నేను ఊరకే -
నిలుచుంటినే
చెలువుడు పిలుచుచు - పలుకగ తలవంచి -
పలుక కూరకుంటినే
కలకంఠి ముంజెయ్యి - కలియబట్టి తన తో -
డలపై జేర్చి చ - క్కిలి గింత పెట్టెనే ॥సుదతు॥

2. ముద్దులగుమ్మ ! నీ మోము త్తి వకసారి - ముద్దివ్వమని
వేడెనే
సద్దుసేయక మన మిద్దరి లోపల సిగ్గెందుకని
పల్కెనే
నద్దికగల మంచి బిగిగల నా మనసు
తద్దయు కరగించి - తా కౌగిలించెనే ॥సుదతు॥

3. తెల నాకుమడుపులు మునిపంట నొక్కి యెం - గిలి
చేసి యందిచ్చెనే
పలుమారు పెదవి యెంగిలి చేసి యూపై - పలు
వరుస నాటించెనే
నెలకూన వంటి నా నెన్నుదురు టద్దములపై చె -
క్కిలి నొక్కి ముద్దాడి కరచెనే ॥సుదతు॥

# క్రమసూచిక

[ * వివరణములతో నిచ్చిన మొదటి 30 పదములలో చూడవలెను.
స్వీ = స్వీయ ; ప = పరకీయ ; సా = సామాన్య ;
క్షే ? = క్షేత్రయ పదములేమో ? ఇ = ఇతరుల పదములు.]

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 12 | ఆసూయ | అసూయ |
| 1 | 17 | విత్కరము | వితర్కము |
| 8 | 2 | నాయుకుడు | నాయకుడు |
| 11 | 13 | నాము | నాడు |
| 13 | 9 | ఔత్సుక్వము | ఔత్సుక్యము |
| 14 | 7 | పలవి | పల్లవి |
| 29 | 9-10 | ఆలశ్యము | ఆలస్యము |
| 29 | 19 | విప్రలంబము | విప్రలంభము |
| 32 | 6 | గొట్టె | గొట్టి |
| 35 | 22 | గాని | గ్లాని |
| 36 | 8 | పశ్చాతాపము | పశ్చాత్తాపము |
| 44 | 7 | చేచుక | చేసుక |
| 51 | 13 | సారధి | సారథి |
| 53 | 11 | శృగారము | శృంగారము |
| 53 | 16 | ధృలి | ధృతి |
| 53 | 17 | రాము | రాడు |
| 57 | 2 | ఆన్నె | ఆన్నె |
| 56 | 3 | కదసి | కదిసి |
| 68 | 2 | జూచే | జూచె |
| 69 | 6 | నెవరొని | నెనయని |
| 75 | 12 | నా-లంవుని | నా-చెలువుని |
| 80 | 3 | కదసి | కదిసి |
| 86 | 5 | పైకొనె | పైకొనె |
| 86 | 9 | అది | అని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 103 | 2 | సుదటు | సూదుటు |
| 112 | 8 | పయినము | పయనము |
| 112 | 12 | నీళ్ల నగు | నీళ్ల నగు |
| 115 | 16 | నిస్ను | నిస్న |
| 119 | 2 | విరవోత్కంఠత | విరహోత్కంఠత |
| 121 | 18 | గోపాలుడో | గోపాలునో |
| 134 | 14 | సఘాలం | సఖాలం |
| 136 | 15 | పాగ్న్య | పాగ్న్వ |
| 141 | 7 | చిన్న | నిన్న |
| 146 | 5 | మగంతిగ | మగంత |
| 152 | 9 | ఆలసి | అలసి |
| 153 | 8 | సొమ్ము పరి | సొమ్ము పని |
| 153 | 14 | ఘన్నగ | ఘన్నాగ |
| 155 | 2 | నెప్పించి | నొప్పించి |
| 155 | 13 | పాగ్న్వ | పాగ్న్వ |
| 160 | 14 | ప్రౌఢిమి | ప్రౌఢిమ |
| 162 | 6 | ప్రత్నత్పతిక | ప్రవత్సత్పతిక |
| 163 | 7 | పేసపుల | పేసవుల |
| 165 | 12 | సగన | సగస |
| 167 | 3 | వంచెన | వంచన |
| 167 | 11 | నాయకునితో | నాయికతో |
| 173 | 13 | సవ్య | సవ్వ్య |
| 175 | 1 | దుస్న | దుస్స |
| 176 | 20 | నెన | సైన |
| 177 | 2 | నెట్ట | నెట్టు |
| 180 | 10 | వెన్నెలాడి | వన్నెలాడి |
| 183 | 1 | కలనైన | కలనైన |
| 183 | 13 | సరసుకు | సరసకు |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 186 | 1 | కపురంవు | కపురంపు |
| 190 | 2 | నవ్వ్వంలె | నవ్వ్వలె |
| 195 | 5 | పెం-పాదపు | పెం-పాదవు |
| 196 | 18 | ందు | ఇందు |
| 202 | 4 | మగువు | మగువ |
| 212 | 6 | గోపాలుండు-డించు | గోపాలు-డించు |
| 214 | 19 | వెలసి | తెలిసి |

పరకీయ :—

| | | | |
|---|---|---|---|
| 7 | 14 | మువ్వ్య | మువ్వ |
| 7 | 19 | జెసెగా | జేసెగా |
| 9 | 13 | చెక్కిటు | చెక్కిటు |
| 10 | 11 | నాయినా | నాయికా |
| 39 | 10 | వగోష | పగోధ |
| 44 | 2 | విరహూత్కంతకిత | విరహోత్కంఠిత |
| 53 | 8 | నన్నేవా | నన్నేవా |
| 68 | 10 | గబనినిమ్మ | గజనిమ్మ |
| 69 | 7 | వీ | నీ |
| 70 | 15 | నున్న | నున్న |
| 73 | 10 | క్రొమ్మడి | క్రొమ్ముడి |
| 74 | 9 | రుగుతు | గురుతు |
| 75 | 2 | నాయక | నాయిక |
| 75 | 3 | తీప్రంగా | తీవ్రంగా |
| 75 | 6 | వాగ్విదగ్ద | వాగ్విదగ్ధ |
| 76 | 4 | నాయక | నాయిక |
| | 6 | స్వాదీనం లేసం | స్వాధీనం లేనం |
| 77 | 1 | పవ్వళించి | పవ్వళించు |
| 92 | 7 | మాటలిదిగో | మాటలివిగో |

